శతావధాని, కళాప్రపూర్ణ

# శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి

'ప్రభుత్వాస్థాన మహాకవి'

బిరుదప్రదాన మహాసభలో అంకితము

సమర్పణ నవ్యాకవులు

భువన శివేతర భంజక
నవనీత పదార్థ రంజనగా నిండిన దీ
కువలయ సుందర భాంత, మ
నవద్యము కళాప్రపూర్ణ నైవేద్యముకాగ.

*Prof. S. Radhakrishnan*

Calcutta University,
19—7—1939.

"I have known Mr. R. Subba Rao for some years past and have learnt to admire him both as a man of high ideals and author of remarkable powers. His familiarity with English Literature and criticism gives him ample advantage over his colleagues in the field of Telugu Literature and he has not been slow to utilise it. His poetic soul, saturated with the best of Indian Culture and Western thought, has found for itself new vision & expression, and it is fairly safe to prophesy that his work will mark an epoch in Telugu Literature. He has placed the Andhra World under a supreme debt of obligation by his substantial and unique contributions to its literature and we hope that he will continue to enrich it.

---

ఓ మిత్యేకాక్షరమ్ బ్రహ్మ
శ్రుతీనాం ముఖ మక్షరమ్
ప్రసీదతు సతాం స్వాంతే
ష్వేకమ్ త్రిపురుషీమయమ్.

ఓమ్

# మాధురీ దర్శనమ్

చేరగ చాతకములు రస
పారణకయి రుచులుతేరు వాకిండ్లను సిం
గారించెడి శుభ్రాంబర
చారు పయోధరవిశేష సౌభాగ్యంబుల్.

వర్ణాత్మిక మగు శబ్ద కు
లార్ణవము తరంగశయ్య లయి చిద్గగనా
కీర్ణామృతాంశు పులకిత
పూర్ణార్థములై, ధ్వనించి పొంగులు పోవున్.

వేద పురాణ విలక్షణ
వాదన మయి హ్లాదరమ్య వై శారద్యా
పాదన మయి సుకుమారా
స్వాదన మయి సాహితీరసము భాసించున్.

మత్యమరాచార్యా సర
స్వత్వాధ్వర్యవమునకు నిబద్ధాంజలినై
సాత్యవతేయ స్మృతి సాం
గత్యవచోముఖికి మఖికి కరములు మోడ్తున్.

౧

హాల గుణాఢ్య ప్రముఖ కు
శీలపు లభిజన నిసర్గ శృంగారంబున్
కీలించి రఖిల సహృదయ
లీలాశయ లాలనా లలిత భంగిమలన్.

తొలి వెన్నతోడ మరిగిన
యలవా టిది ఆంధ్ర జాతి; కానందపథాం_
చలమున నిలిచెను లక్ష్యము;
లలితము కాదో తదీయ లక్షణముఖముల్?

అపుర రమ్యత నెఱిగిన
పటుడు రుచిరార్థసూక్తిధాముడు వాచా
విదుషుల కొసఁగె భారత
చాటుపసూత్రమును ఉభయ పరితార్థముగన్.

రస మది యథాతథమ్ముగ
ప్రసరించును కవుల పాటవము కొలది యనెన్;
గ్రసితాఖిల శబ్ద బ్ర
హ్మ సమజ్ఞాపరుడు నన్నపార్యుం డాదిన్.

రసరూపము బ్రహ్మానం
ద సధర్మ శ్రీమయముగ ధ్యానించి అతం
డసదృశ మధురగ్రథన
ప్రసన్నముగ తీర్చె తెనుగుభారత పంక్తిఁ.

ఇటువంటి శబ్దదర్శన
పటిష్ఠుల తపోవరేణ్యా వైదగ్ధ్యములఁ
స్ఫుటమయ్యె నాంధ్రవాణీ
నటనాఽ పూర్వప్రయోగ నవ్యనిపుణిమల్.

స్వస్థాన వేష భాషా
సుస్థిత సౌందర్యాలుబ్ధ సుమనసు లీ యాం
ధ్రస్థానీయులు; పాషం
డ స్థావర రుచులు వీరలకు నింపవునే ?

పామర పండిత కుల ముఖ
కోమలమగు వైకృతానుగుంఫిత ఫణితిఁ
ప్రేమించి అన్యభాషా
ప్రాముఖ్య మపాకరించి రాగిలి రాద్యుల్.

అమృత రసోపాసకులై
శ్రమించిరి మహాంధ్ర కవులు శబ్దబ్రహ్మం
డమునం దానందావర
ణము సాహిత్యసాధనకు స్థానముగాఁ.

౨

అతిసంఖ్యా మనాద్యంతము
ప్రతీతమేధాప్రకాశపర మీ నునుసం
తతి తనిసి తనిపె నానా
గతిగమ్యోపాసనాప్రకారముల సుధీ !

కలుగదె కుసుమమ్ములను కు
వలయ కమల కుంద భిన్నవర్గము నానా
విలసనగుణవైభవ, మ
ట్టులె వైవిధ్య మగు మనుకుటుంబమును సుధీ !

శ్రుతులును, స్మృతులును, శాస్త్ర
ప్రతతియు, ఆచారధర్మబంధంబును సం
స్కృతము లయి వెలసె మను సం
తతిశోభన మొకటె లక్ష్యధారణగ సుధీ !

జ్ఞానోపాసనలకు క
ర్మానుష్ఠానములకు ఇతరాధ్యాత్మిక సం
ధానముల కేది స్థానము !
మానవజీవితము గాక మహిలోన సుధీ !

లౌకిక కామితములకు న
లౌకిక పరమార్థ సిద్ధులకును శరీరం
బాకర మాద్యము నగు నని
వాకొని, రస్మత్తపోవిభావసులు సుధీ!

సామము పాడుచు బ్రావిరి
సోమము స్వర్లోక కాంతు సుడియగ మన మా
తామహ పితామహ ప్రపి
తామహు, లానందవల్లి తలిరింప సుధీ!

ఉపనిష దుపాసనల బడి
తపియించిరి బ్రహ్మతత్వతత్పరదీక్షా!
అపవర్గ ధర్మసూత్ర
వ్యపదేశము విప్పిరి 'అహ మస్మి' యని సుధీ!

యమియించి రింద్రియముల ని
యమించిరి ప్రవృత్తిధర్మ, మైహికవైము
ఖ్యము పెంచి 'రకామ హాత'
ప్రమాణము వరించి యోగబంధమున సుధీ!

సహజ పరిణామమును ని
గ్రహించి దమియించుటో! సుకౌశలకర్మో
ద్వహనానువృత్తి జీవిత
విహిత మనుష్ఠించుటో! అపేక్ష్యంబు సుధీ!

బహుళ కఠినాసిధారా
సహాయసాధన నయింపజాలిరి; కాంతా
సహకారనియత లీలా
వహ మగు అద్వైతమిథునబంధంబు సుధీ!

'లవియింపకుమి ప్రజా తం
తువు' నను శ్రుతిశాసనము మిథునబంధమహః
సవనోత్సవమున గా, కెటు
లవు పాలింపంగ మానవావళికి సుధీ!

విమలబ్రహ్మాధీనత
రమింప నగు నిర్వికల్పరత్యమృతరుచుల్,
సమధిక మిథున ప్రేమా
గ్రమహోదళ ప్రతిఫలింప గాంచనగు సుధీ!

తెలుపరె గార్హస్థ్యమున అ
మలీమసము లయిన కర్మమధురిమలు! తద
స్ఖలితోత్తరభావాంత
ర్వలయమ్ము వాచామగోచరం బనిరి సుధీ!

యమ నియమ విధి నిషేధ
క్రమశాసిత మయిన ధర్మకల్పముకంటెన్;
రమణించె విలక్షణ మయి
ప్రముదిత వాఙ్మయ తపశ్చరణరీతి సుధీ!

బహుయుగ యుగాంతరంబుల
మహర్షికుల సాధనాసమంచిత తేజో
నిహితం బయినది, భారత
మహనీయ రస్యానువాక మండలము సుధీ!

ఏతన్మహనీయానుభ
వాతతనిక్షేపనిధులె అందెను మనకున్,
గీతచ్ఛందోరూప
జ్యోతిర్మయ వాఙ్మయముగ శ్రుతు లీన సుధీ!

శ్రీవర రీయమ్మృతాతుర క
ల్ప వసు క్షేత్రవలయమును వర్షింపగు ? నూ
నవసంస్కృతి జీవద్దై వ
భవ మవిభాజ్యరసవత్ప్రవాహంబు సుధీ !

సుకుమారులు సుఖచారులు -
సుకృతులు సుమనోవినోద సులభులు శిఖా
క్రకచము నోర్వరు, లాస్యా
త్మక పీడన మోర్తు రభిమతం బగుట సుధీ !

తీయని యీసాధన, మన
పాయముగా నెఱపజాలు వాలకము ఉపా
దేయం, బభినవకవితా
ప్రేయస్సంవరణ తరుణవృత్తమున సుధీ !

3

అవ్యక్తము, నిత్యోత్సవ
నవ్యము, లలితావలోకన స్నేహజ లీ
లా వ్యతికలితము, నగు నొక
దివ్యాంశ స్ఫురించెడి ప్రకృతిముఖమున సుధీ!

బీజచ్ఛేదము కాని మ
హోజోవిద్యుత్తరంగయుక్తం బగు నీ
రాజచ్చైతన్య మమృత
భాజన; మది నిత్యనవ్యభాసురము సుధీ!

పరిపూర్ణ కాదె! ప్రతి వ
త్సర నవవర్షోదకోపసంపన్నంబై
హరిచరణ మార్జనామృత
చిరజని యగుగంగ మహిమ చెడిపోక సుధీ!

తొలిచూత మె యీనాడును
ఫలియించెడి ననుచు చెప్పవచ్చునె వసుధన్;
ఫల బీజ పరంపరలో
విలక్షణ పరిణతి కానిపించు గద సుధీ!

ఋతువున కొకరుచిరాలం
కృతిఁ జవదరించి యభినయించెడి సృష్టి
స్థితి లయ యోగిని; ఆనం
ద తనూతారుణ్యారోచనము గాగ సుధీ!

కలదెందొ నిత్యసుందర
లలితాలంబన, మనంతలావణ్యా సము
జ్జ్వలహాస్త మొకటి! తన్మం
గళాభినయ విలసనమ్మొ కావ్యకళ సుధీ!

శుక్లాంబరాభరణ, బ్ర
హ్మా క్లేశాపహరణ, శ్రుతిమానస కాసా
ర క్లిన్న తరుణచరణయె
అక్లాంతసువర్ణజగతి కధిరాజ్ఞి సుధీ!

[illegible] ౪

శ్రీసృష్టి నతుయములై
భాసించెడి ప్రకృతి భూతపంచకము; తదీ
యాసదృశ మేలనా వి
న్యాసమె బింబించు మానవాకృతిని సుధీ!

ఈ మానవ వృత్తంబును
మీమాంసించిన మహర్షి మిహికాంశులు నా
నా మార్గము లరసిరి; అం
దీ మధురపథంబు వాగభీప్సితము సుధీ!

కవితా రసాలమున ప
ల్లవించె శబ్దార్థపిచ్ఛిల శ్రీ కల్యా
ణ వివర్త; మిదియె కాంతాఽ
నవగీత ప్రీతిదర్శనం బందు సుధీ!

వాగర్థ విశ్వముఖమున
భోగింపగ నగు అనంత భూతంబులలో
రాగిలు ప్రణయ మధు హావి
ర్భాగము; సహృదయ జనానుభావ్య మిదె సుధీ!

ఈ భూతచక్ర మందున
శోభిల్లెను మానవుండు సూక్ష్మ ప్రజ్ఞా
లాభోదయమున ప్రేమ
ప్రాభవ మనుభూతి నెఱిగి పాడంగ సుధీ!

స్త్రీ పుంసయోగసిద్ధి క
లాపమ్మగు జగము మంగళాలంబనము
ద్దీపితము చేయ, మాధు
ర్యోపాసకు లయిరి సుకవు లుర్విపయి సుధీ!

ఈ సృష్టి స్థితి లయ వి
న్యాసము నానందమూల మని రుపనిష ద
భ్యాసకు లేతత్ప్రాప్య వి
ధా సాధన సాహితీవిధాయకము సుధీ!

ఆనంద భానుమతి, విబు
ధానంద పదార్థఫల రసాలసశాఖా
సూనవతి, బ్రహ్మసతి, వి
జ్ఞానోద్ధస్య స్తనవతి సాహితియె సుధీ!

౨౪

మన సఖిలేంద్రియములలో
సునిశితబలమగుచు యోగశోధనలఁ. తే
లెను ! యావన్మానవ బం
ధన మోక్షణములకు కారణం బదియె సుధీ !

పరస వికార విరుద్ధ వి
పరీతము లగు విషమానువర్తనల నిరం
తర వికలీకృతమై ని
ష్ఠురమై జనులందు మనసు శుచితొలగి సుధీ !

అది విశ్వతోముఖప్రియ
మృదుమధురాలోక పారమిత సాత్వికమై
పొదలును నిత్య సుమంగళ
సదమల సాంగత్య లగ్న సాధనగ సుధీ !

కలదొకట దుర్విపాకము
కలదింకొక్కెడల విశ్వకల్యాణ కలా
కలనము లీప్సితశిఖా
బలపరిణామ పరిపాక భాగ్యమును సుధీ !

మానస మది సంకల్ప
స్థానంబయి సకలపరుష సరళ విభావో
త్థానపద మగుట తదుపా
దానమ్మృదూకరణ మాద్యధర్మమగు సుధీ !

మనన మహోమధుర పయో
ధి నిమగ్నోన్మగ్నము లయి తియ్యములై తే
లిన మానస మహిమలు మా
ర్చును విశ్వమును విహితైక రుచిరముగ సుధీ !

తెరలి మసలిన పయస్సులు
మెఱుగారుచు నురుగులాలి మీగడయగు మా
దిరి స్థాయిభావ మందెడి ;
తరుణాంతఃకరణ నైజ ధర్మములు సుధీ !

౬

ప్రియమును హితము ననుద్వే
గ యుతము నగు వాక్యము ; అధిగత కవికంఠం
బయి మానవులకు ప్రేమా
ధ్యయన ప్రతిపాద్య సూత్రమయి నిల్చె సుధీ !

హిత మఖిలప్రాణుల కభి
మత మగుటను విశ్వమెల్ల మంగల్యానయ
ప్రతిమా ర్థూపకముగ సా
హితీ కుశీలవులు అభినయించెదరు సుధీ !

శ్రోత్రద్వారము లోకటను
నేత్రకవాటము లోకటను నిత్యముగ బహి
శ్చిత్ర జగచ్చైతన్యపు
మైత్రిని నడిపెడి యథాప్రమాణముగ సుధీ !

ధ్వనివలయ సహస్రగతుల
ననుసంధించును శ్రవణము ; లాకర్షించుఁ
కను లీ యఖండసృష్టి
ప్రణిహిత విద్యుత్స్వరూప రంజనము సుధీ !

విగళితముఖమై శబ్దము
తగిలెడి అర్థమును వధువు ధవుని విధముగా;
జగ దఖిల బాహిరాంతర
సుగతులుగా తన్మనోజ్ఞసుఖ స్మృతులు సుధీ!

ఏత ద్విశ్వ సుమంగళ
జాత స్పందానుగతులు శబ్ద బ్రహ్మోం
డాతోద్య శ్రుతులయి నవ
నీత ధ్వని సాహితీ ఫణితి గొనియె సుధీ!

౭

అతి నగ్న శుద్ధమయి అ
ప్రతిబంధ క్రీడన్నాభరణమయిన అసం
స్కృత శైశవమున రతి అవి
కృతమగు ; అపరిగ్రహావహితమౌట సుధీ !

ప్రాణుల కెల్లను సర్వాం
గీణమయి విలసిలు రతి ; అకిల్బిషమయి క
ల్యాణ పరమ వర్చస్కధు
రీణమ్మగు స్థాయి నది వరించుటెటు సుధీ !

తరుణోదయ విద్యుద్వ
ల్లరీ సముల్లాస మంగళ పయోధర సుం
దరమగు పరువంబున రతి
పొరయుఁ బ్రణయార్ద్ర నాభిముఖర క్తి సుధీ !

తరుగక విరుగక చెఱగక
చిరకాల స్నేహ వైర శీతోష్ణ పరం
పరలఁ జెదరక నిర్జర
పరిణతి గొను రతియు మిథునబంధమున సుధీ !

నరనారీ సంహితమై
స్ఫుర దంతఃకరణ ధర్మచోద్యం బగు త
త్పరమ ప్రాప్యంబునకై
నిరంతరాన్వేషణలు చనెఁ మున్నె సుధీ !

లౌకిక నిషేధ విధి హతి
తాకని నవ బాల్యజీవ తారుణ్యకలల్
పాకమగు బ్రహ్మచర్యా
ప్రాకర్షిక నియతి మిథున భాక్తముగ సుధీ !

ఏత దవస్థా ఫల బల
జాతము మదమూర్తమై విషయతిమిర పరా
భూతము కాకుండగ నవ
నీతముగా మారుపథము నెమకవలె సుధీ !

నర నారీ సంబంధము
పరిభావింపుము దిశా విభాగము వరుసఁ
ధర ; జననీ భగినీ సహ
చరీ కుమారీ క్రమము నిజంబగుట సుధీ !

తూరుపు పడమర కాని ప్ర
కారము దక్షిణ ముదీచి కానివిధమునఁ
మారవు తదీయ బంధము
లారంభ సమాప్తదళల యందెందు సుధీ!

ర

అంగజ ధర్మకలాప త
రంగిణి నానావిభావ రచితాద్వైతో
త్తుంగ మయి, లీన మగు అ
నంగ పరానందశోభనస్ఫూర్తి సుధీ !

తనురక్తములయి అంత
స్సున రాగిలి లేచుచు పడుచుఁ మేళనముఁ-
గొను చేతో ద్రవరతులు; అ
తనుమథనముల తెఱలి అమృతములగును సుధీ !

ఋజువాచకు లగు కవి త
ల్లజు లుపలక్షించి రాకళాతన్మయతఁ,
నిజదేవభూయ మంది మ
నుజేంద్రియములు మెఱయ అతను ప్రమితి సుధీ !

ఆకలి పిపాస లార్పగ
ఆకలములు, అంతరమున అవ్యక్తములై
రేకెత్తె శ్రోత్రనేత్ర స
మాకీర్ణ కుతూహలస్పృహల్ పెనగి సుధీ !

వైశాఖదివస పులకిత
పేశలకలకంఠ మయిన పికరుతి నిష్ట
ప్రాశన గొనె శ్రవణేంద్రియ
కోశము; తమి కనునయంబు కుదిరినటు సుధీ !

జగతీముఖ విలసన పా
రగ శోభాభాసిత మగు ప్రత్యూషరుచిఁ
గగురొత్త తనిసె నళులు;
మిగిలెడి కనువేదురుల్ శమింపంగ సుధీ !

సురుచిరశబ్దములఁ సుం
దరరూపంబులను ప్రాణి తనియుటయె కళా
పరమరహస్యం; బిదె రతి
నిరీక్షితం బగు రసోపనిషదంశ సుధీ !

౯

రచనము కావ్యము; ఏత
ద్రుచిమద్బంధము రసస్వరూపబ్రహ్మో
భ్యుచితకళాచ్ఛందం, బే
రుచిర సముద్దీపనమున ప్రోది యగు సుధీ !

రమణీయార్థ తరంగిత
కమనీయం బయిన కావ్యకంఠధ్వనిలో,
సుమమున మకరందమువలె
భ్రమించు రసము హృదయానురక్తముగ సుధీ !

కవితకు రస మసువులు, తత్
కవనము భావప్రఫుల్ల కమనీయముగా
నవనవలాడెడి నుడువుల
సవరింత్రు కవులు సుహృత్ప్రసన్నగతి సుధీ !

సీతారాములు కానల
కాతరులై కన్న కష్టకార్యము లెల్లన్
నీతములై, సుకవిసరో
జాతముగాఁ భావ మనిరి సహృదయులు సుధీ !

కార్శ్యము శారీరకమై
పర్యవసించెను ఫలించి; భావము వాచా
ధార్యంబై అశరీర స
పర్యల కయ్యె న్నవరస పరిణతిని సుధీ!

అంగాంగ విలక్షణరుచి
సంగత తనుసౌష్ఠవంబు సౌందర్య మగున్;
శృంగార మాయె కృతుల అ
నంగ వ్యంజక కలామయస్ఫూర్తి సుధీ!

ఈ కార్యకలాపము భా
వాకూతరసాదిరూప మయి, వాగర్థ
ప్రాకామ్యయోగసిద్ధిన్,
ఆకాంక్షాలోక పేయ మగు కృతుల సుధీ!

## ౧౦

ముఖ్యార్థ బాధకంబయి
ప్రఖ్యాత కవీంద్ర కంఠఘణితి ధ్వనించెఁ
వ్యాఖ్యాత లరసి రట ఆ
లేఖ్యంబగు స్వాదనీయ లీలాప్తి సుధీ!

అసమర్థ వ్యాఖ్యాహి
గ్రసితములయి మూర్ఛబడిన కావ్యపికంబుల్
హసియించి పాడె 'సూరి' స
రసాంభిషేక పటిమా పరామర్శ సుధీ!

కవితా పితామహుండు ను
డివెను 'బయలు గాక ద్రావిడీ స్తనము లటుల్
కవితయు నఱచా టగు అం
ధ్ర వధూటీకుచములగతి తనరు' నని సుధీ!

మనసున మొలకెత్తిన మె
త్తని తీపులు మిగుల సున్నితము; లయ్యవి ప
చ్చని పదముల పొదిగిళ్లఁ
తనికెడి ముచ్చట్లు సంవృతములాయె సుధీ!

గూఢము హృదయంగమగతి
గూఢత మీమాంస కంతకును మూలమగుఁ ;
గూఢము రసోదయస్థితి
గూఢత తొలగఁ జుగుప్స కోల్కొనదో సుధీ !

చెయి తలగడగా విరహా స
మయాలస యయిన లలనను స్మరణకు తెచ్చెఁ ;
ప్రియవాచకు డయిన సుకవి
'శయనించెను పద్మమందు శశి' యంచు సుధీ !

పాషాణములును నవ పీ
యూషము పిదికెనట నవనవోన్మేష ప్ర
జ్ఞా పాడబ మృదులీలా
భాషి జగన్నాథు తండ్రి పాఠమున సుధీ !

మధుముఖ కిసలయ చర్వణ
విధేయమయి రమ్యమయిన పికకంఠమటుల్
మధురమనోజ్ఞ స్వరసుఖ
మధనఁ తేరినది తెనుగు మసృణమయి సుధీ !

౧౧

అభినవ శిరీష కోమల
ఋభురక్తులు సాత్త్వికాంశు శృంగార కళల్ ;
శుభమింప వవి ముదిసి ముది
రి భగ్నమైపోవు తను శరీరమున సుధీ !

వెన్నెడలిన పుండ్రేక్షువు
కన్నుల రస మారిపోవు కరణిఁ భుక్తా
పన్నచ్ఛిన్నాంగకముల
వన్నెగిలవు ; రతి రసానుభవములును సుధీ !

రతి చిత్సాదార్ద్ర; మది పు
ష్పితమయి, స్త్రీపుంసయోగ చిరశిక్షా స్నే
హితమై, సుమానుష భవ
క్రతుకల్యాణంబున కగు రమ్యముగ సుధీ !

పసితనపు పాల మిసిమిడి
వస నెసగెడి పచ్చివయసు వాల్లభ్యములఁ
కొసరి కొనగోరి ప్రాక్తను
విసర్జన మొనర్చు జీవి వేడుకనె సుధీ !

ఈశ్వర భావమె కద జగ
దైశ్వర్యం! బిందు జీవి కాప్యాయము వా
గీశ్వరు లుపలక్షించి ర
నశ్వర మాధుర్యభావనా నిరతి సుధీ!

కాదంబినీ జఠర తటి
దాదికమటు పరిగ్రహింప నగు సాహిత్య
స్వాదుకళల్ సౌందర్య
శ్రీదాక్షిణ్యావధాన శిష్టగతి సుధీ!

జగమంతయు సౌందర్య
స్థగితము శివమయవు తత్ప్రసాధన రేఖా
నిగరణ రచనా వ్యంజన
నగు ఆనందంబు శాంతియగు నవల సుధీ!

అనవద్య మనుతుణ నూ
తన సుందర సుప్రసన్న దైవీతంత్రా
వనమగు సృష్టిని జీవియు
అనువిద్ధానందకాంతు నవతరిలు సుధీ!

తనువును సాలంకృతముగ
నొనరించి ధరింతు రతను యోగాస్ఖలిత
ప్రణయాత్త బ్రహ్మానం
ద నిరూఢాద్వైతసాధనకు నరులు సుధీ !

స్పంద ప్రవాహ వీచీ
కందళితం బైన యీ జగద్వలయమునఁ
చిందు ననుక్షణమును ఆ
నందము సౌందర్య ధారణాపీథి సుధీ !

తేనె కొలంకున పెరిగిన
దీ నవనీతాభిజాత హృదయంగమ శిం
జాన శ్రీపద పల్లవ
జాను తెనుగుతల్లి నుడికి జయమగును సుధీ !

రమా ప్రభ